Sathi Mohan Reddy

## ఎన్. రాద్లోవ్




"ప్రగతి" ప్రచురణాలయం
మాస్కో

## పంతగొండి మేకపోతులు





వంతెనపై మేకపోతులు రెండు
పంతముతో బలమున ఢీకొనె.



వెంటనె నదిలో ఆ పోతులు రెండు
వింతగ పడె దుబ్బున తలకిందుగ.

ఏరి, నా పిల్లలేరి?



అయ్యో! నా పిల్లలేరి?



అరె! ఈ సంత
కాదు సుతరాము నా సంతు!

అక్కరకు వచ్చినవాడే అయినవాడు







# బాతులమీాద కుందేలు స్వారి



"నేనూ వస్తా మీాతో బాతు బావలూ!"



కుందేటి స్వారి మొదట కడు సోకుగా సాగిందీ...



కప్పల జూచిన వెంటనె బాతుల నోరూరిందీ!
కుందేటి షికారు నడియేటిలా కలిసిందీ!







ఏరు దాటడమూ – అదొక నేర్పే!
ఈత నేర్చితే – అరగడియ సేపే!

తొలి బాతుపిల్ల మూపెక్కింది – తొలి కోడిపిల్ల
మలి బాతుపిల్ల మూపెక్కింది – మలి కోడిపిల్ల,

కడ బాతుపిల్ల మూపెక్కింది – కడ కోడిపిల్ల,
తల్లి బాతు మూపెక్కింది – తల్లి కోడి!

# గడుసరి చేప







ఏమి చేసిన చేయండీ:
ఈ చేప మీకు చిక్కదు సుమండీ.

# పురుగును పట్టుకొన్న వెర్రినాగమ్మలు



అన్నదమ్ము లిద్దరమూ — అరిగితిమీ వాహ్యాళికి
సన్నని నల్లని పురుగొకటీ — సనసన్నగ అగపడె మాకూ.



నోటితో పట్టితి నేనూ — వాడును నా తరువాతా
గోటితో దానిని రక్కితిమీ — ముక్కుతో దానిని కొరికితిమీ.



"గట్టిగ పట్టే లాగుదమా!" — చెప్పితినే తమ్మునితో
చట్టున లాగితిమిద్దరమూ — చెప్పలేనిక, బాబోయ్!



హడలెత్తించె దృశ్యం — సగం గుడ్డివడె నా కన్నులు!
పిడుగుల చప్పుడు — గడియలు పడె తమ్ముని చెవులు!







"కీచు-కీచు-కీచు!" మని
బంగరు పిచ్చుక గానము చేయగ,
దానిని చూచి,

ఒక్క పరుగున దూకి గండు పిల్లులు రెండూ
ముక్కు చితికేలాగూ ఢీకొట్టుకున్నాయీ.
అందుకు కారణమేమో?

# యాంత్రిక ఎలుక





"నాది!"

"నాది!"



"ఫో, నాదీ!"

"ఛీ, నాదీ!"



ఫలితంలేని పోట్లాట సుమండీ.

# ముచ్చటైన ఆట



ఈ ఖడ్గమృగమే
ఓరిమితో వేకువ వరకు కూర్చుందంటే

ఇక సందేహమేటికి?
ఈ రేతిరంతయు సాగును ముచ్చటగ ఈ ఆట!

"కుందేలుపిల్లా, కుందేలుపిల్లా, పిల్లిమొగ్గేసి రావమ్మా!
కిందకి వస్తేను కమ్మనీ కేరట్లు కొల్లగా ఇస్తాను నీకు."

"పిల్లిమొగ్గ వేస్తేను యమలోకమే ప్రాప్తి నాకు
చల్లగా గాలిగుమ్మటం చేపట్టి చక్కగా దిగుతాను నేను."

# కుక్కా, ఈగా



మెత్తని కుర్చీలో కునుకు తీసిందీ
ముద్దుగ కుక్క.



అంతలోన ఈగ ఒకటి ఝుంకరించిందీ
"జుమ్, జుమ్!" అని రొదచేసిందీ.



ఈగను పట్టే పగ సాధించుటకే
ఎగిరి లేచె కుక్క.



తుర్రున ఈగ ఎగిరీ కుక్క చెవిలోనే
గుర్రున గురుపెట్టిందీ.



గుర్రు విని రోసము చెందిన కుక్క కుర్చీనే
కోరలతో పీకిందీ.



పీచును పీకుచు బేపి హఠాత్తుగ లోకప్పను
ఠంగున ఢీకొందీ!

# టక్కరి పుట్టకొక్కు



ముండ్లపందొక్కటి వెడలె పొరుగూరికి
మార్గమున డస్సి సేదకు సొగిలబడె.



మూటను బాటనెడ గుట్టపై బెట్టి
చెట్టు నీడను నిదురచెందె హాయిగ.



ముండ్లపంది పెందలకడ లేచి పరికించగ
మటుమాయమాయె మూట గుండెలవియగ.

## కాలు మెలిపడకుంటే — మంగలం దొంగిలించే వుందును

తప్పక దొంగిలిస్తా!



అరె! పప్పులో కాలువేశా!

# తాబేళ్లూ — ఎలుగ్గొడ్డూ



"అబ్బాయిలూ, చేతిలో చిక్కారు మీరూ!
పబ్బము నాకూ, ఇక ఇల్లు చేరరు మీరూ!"



అబ్బాయిలు దబ్బున లేచి నిలిచారూ
అబ్బాయిలు ఒండొరుల కౌగలించుకున్నారూ.



ఇద్దరు గిరగిర నదిలోకి దొర్లారూ



ఉద్దరినున్నా ఎలుగును చూచీ నవ్వారూ.

కొలనులో ఉయ్యాల ఊగితే కలకాలమూ కష్టాలే







# టక్కులమారి కుక్కపిల్ల



మెండుగ మొరిగెడువారూ



దండిగ జగడాలాడెడువారూ



తిండికి లేక ఏడుస్తారూ.

# వూలు వుండ ఏదీ?



చెరచెర దొర్లిందీ, గిరగిర తిరిగిందీ,



గిరగిర తిరిగిందీ, చెరచెర దొర్లిందీ,



వుండ చకచక దొర్లిందీ, వడివడి విడిపోయిందీ.



ఎల్లా అది మాయమందీ నీకూ నాకూ తెలుసూ,
పిల్లికి తెలియక తెల్లబోయిందీ.

# హుషారు నౌకర్లు



"వెళ్లండి, వెళ్లి దానిని పట్టుకోండి!



రాండి, దానినిక్కడకు తీసుకురాండి!"



కుక్కలు తెచ్చె కుళ్లాయిని
ముక్కలుగ కొరికి తెచ్చె దానిని.

# ముళ్లపంది ఆపిల్ పండ్లను మూపున పెట్టుకు మోసింది



ముళ్లపంది పండ్లను చూచి "హో!"యని నిట్టూర్చిందీ.



"ఒక్కొక్కటె ఇంటికి తరలించుట వెక్కసమే!"



తత్తరపడకనె తలపోసి, చెట్టునెక్కీ దుబ్బున దుమికీ



మొత్తముగా మూపున పెట్టుకు మోసిందీ.

## ఎంత హాయి ఈ ప్రయాణం!

వలవల యేడ్చె ఏడుపంది పిల్ల:
"కాళ్ల పుళ్ల, కదపలేను అడుగు!

డోలీలో అమ్మ ఇట్లు మోసికెళ్లితే
మైళ్లకొద్ది వెళ్లగలను!"

# పిల్లి ముక్కే చితికింది







తుంటరి పనులు తలపెడితే
తంటాలు కలుగు తుంటరికే.

# కప్పురపడని కప్పపిల్ల



కప్పపిల్ల తప్పక మృతినొొందెడిదే,



ఒప్పగ తెలివితేటలు చూపకపోతే.



చప్పన చక్రములో దూరకపోతే



అచ్చముగ కొొంగ దానిని కబళించెడిదే.

# అబ్బురపడె పీటర్ మామ





పీటర్ మామ పెట్టెను కేక:
“కటకట! నా కన్నులకేదో లోటు కలిగె,

కట్టకడ నే మంచము పట్టెద
డాక్టర్లను వెంటనె కొనితెండిర, బాబూ!”

# గొడుగు కడగండ్లు









# పిల్లికూన తెల్లబోయింది

అండము విడగా అబ్బురపడె పిల్లికూన:

"ఏడనుండి ఏతెంచితివి నీవు, పిల్లకోడి?"

# ఇద్దరు నేస్తులు



చెట్టున ఫలములు ఎత్తుగ వుంటే,



చెట్టు కింద వున్న ఊగుపలక ఎక్కితే



చటుక్కున నువ్వూ నేమా ఎగిరీ



కటుక్కున ఫలములన్నీ కొరికీ భుజించుదాం!

# ఉడుత విందుకు వెళ్లిన విధం

"వొడ్డు చేరుకొనుట ఎట్లు నీవు?
తెడ్డుపడవే లేదు, అడ్డకట్టే లేదు!"

"వడ్డన వేళకు నే తప్పక వచ్చెద
అడ్డులేదు నాకు నా గొడుగుండగ!"

# బొమ్మ కుందేలు అసలు కుందేటిని రక్షించిన వైనం



వేటకుక్కల బారినుండి రక్షించుకొనుటెట్లా?



ఆటబొమ్మ అగపడె కదా బాట నడుమ!



వాటముగా దీనిని వాటి బారి నిల్పెద వాకిట,



నీటుగ ఆటబొమ్మ బదులు నేనే కూర్చుండెద!

# రక్కసి ఎలుక



"ఆగు, చిట్టెలుకా, ఇదె వచ్చెద!
ఆకలితో లొట్టలు వేయుచు నిను కబళించెద."



"తొందరెందుకు నీకు పిల్లిబావా?
రెణ్ణాళ్లలొ వాళ్ల చేసెద నేను."



"ముక్కు — మూరెడు, కళ్ళు — చేరెడు!
రక్కసి వచ్చె, నను రక్షించుడి, బాబోయ్!"

# పొడుపు కథ





గట్టున ఇదేమి విడ్డూరం?

మొగ్గ లేస్తున్నాయే మేజోళ్లు!

# మంచు నిచ్చెన ఎక్కి నా టోపి తెచ్చుకొంటి



ఈదర గాలికి రివ్వున నా టోపి ఎగరె.



అమ్మ విలపించె, అయ్య కోపగించె.



తల్లితండ్రులకు గడ్డకట్టిన తాడును చూపితి.



భళిభళీయనుచు మెచ్చిరి నా తెలివికి!

# కుందేళ్లు తోడేలును పట్టిన విధం

తోడేలుకు నోరూరిందీ — కుందేలు ఎక్కెసమాడిందీ!

"హడలే లేదు మాకు తోడేళ్లంటే — చూడిదిగో!"

వెడలెద దాటున కత్తెరబోను నడుమను

వేడుకగా తోడేలు నీవే పడెదవు బోనులో!

# ప్రాణభిక్ష పొందిన పక్షిపిల్ల



గూటినుండి పిట్ట పడె తోటలో.



ఒంటిగ నుండుట దానికెంత కష్టము!



వెంటనె వారిరి తల్లితండ్రులు



పిల్లను విడిపించగ కడగిరి.



"పంజరమును తెరచుట ఎట్టుల?"



"గుంజాటన మానుడి" అనుచు మూషికము



పంటితో తీగెల కొరికి పిట్టను విడిపించె.



తొంటివలె అది పాడుచు మింటనెగసె.

# పనికిమాలిన ఎలుకబోను



ఎలుకను వెంటబెట్టింది పిల్లి



ఎలుక దూరింది పాల సీసాలో



పిల్లి ప్రీతిగ మ్యావ్ మంది



పిల్లి ప్రయాసతో ప్రయత్నించింది



పిల్లి తల్లడిల్లి తలపోసింది



ఎలుకలు తమ్ముని రక్షణకై ఏతెంచె



జైలునుండి పలాయనమాయె ఖైదీ ఎలుక



''పిల్లీ! సెలవు, నీకె కల్గుగాక సేమము



పనికిమాలిన ఎలుకబోనది, పో! పొమ్మ!''




"సిద్ధముకండీ! అందరు బయల్దేరండీ!"
తథ్యము, పచ్చకప్ప పరుగు వ్యర్థమండీ!




పందెం గెల్చినది ఎవరండీ?
పందెం గెల్చినది పచ్చకప్పేనండీ!

# కడపటి కథ







కోతులు మూడూ దొంగిలె కొంటెగ వల ఒకనాడు,
చేతుల దానిని చెట్లకు చుట్టే నిద్రతీసె చక్కగను.

బొమ్మల పొత్తము చదివితిరి బాలలు మీరూ
బుద్ధిగ బువ్వలు తిని హాయిగ పండుకొనండీ.